మద్యపాననిరోధక కేంద్రసంస్థయొక్క యుపాధ్యక్షులగు దివాన్ బహాదురు ఎస్. అరావముదుఅయ్యంగారు పాఠ్యగ్రంథములలో మద్యపాననిరోధక విషయములను ప్రవేశపెట్టి విద్యార్థులకు చిన్నతనమునుండియే మద్యపానమునకు విముఖతగలుగ చేయవలయునని కోరుచు యొక తీర్మానమును ప్రతిపాదించిరి

శ్రీ గోవిందరావు నంగాతేర్కరు గారిచే తీర్మాన మామోదింపబడి యేకగ్రీవముగా అంగీకరింపబడెను

తరువాత ఉస్మానియా విశ్వవిద్యాలయ పరిపాలనయందు తగిన ప్రజా ప్రాతినిధ్యము యుండునటుల మరియు విశ్వవిద్యాలయ పాలనకై యొకశాసనము తయారు చేయుటకై అధ్యక్షస్థానమునుండి తీర్మానము ప్రతిపాదింపబడి యేకగ్రీవముగా అంగీకరింపబడెను

రాష్ట్రమునందలి విద్యావిధులలో సక్రమపరిపాలనము జరుగుటలేదని పదేపదే వచ్చుచున్న ఆక్షేపణలను పురస్కరించుకొని, ఆ విషయములందు విచారణగావించి అవసరచర్యగైకొనుటకై స్థాయిసంఘమునకు అధికారమొసగు తీర్మానము రాష్ట్రమునందలి మూడుముఖ్యమైన రాష్ట్రీయభాషలలో ఉస్మానియా విశ్వ విద్యాలయమునందు తగినసౌకర్యములు లేనందునను రాష్ట్రీయభాషలలో ఎం ఏ పట్టమును పొందుయేర్పాటులేనందునను యీమూడుభాషలను అభ్యసించుటకు కృషికరమైనట్టియేర్పాటులను గావింపవలయునని ప్రభుత్వమువారిని కోరుతీర్మానము రాష్ట్రమునందలి ప్రజలకందరికిని యెట్టి విచక్షణలేనంత సైనికశిక్షణనొసగవలయునను తీర్మానమును అధ్యక్షస్థానమునుండి ప్రవేశపెట్టబడి ఏకగ్రీవముగా అంగీకరింపబడెను

## ముగింపు

స్థాయిసంఘమును యెన్నుకొనుతీర్మానము శ్రీ బి. ఏ. పాటిల్ గారిచే ప్రతిపాదింపబడి శ్రీ గోవిందనాయకుగారిచే బలపరుపబడి స్థాయిసంఘము యెన్నుకొనబడెను

అధ్యక్షులు మహాసభను జయప్రదముగా జరుపుటలో తోడ్పడినవారందరికిని ముఖ్యముగా అధ్యక్షపీఠమునకు తనకంటెపూర్వ మెన్నుకొనబడి కారణాంతరములచే స్వీకరింపజాలని శ్రీ ఆర్. ఎస్. నాయకుగారికి తనకృతజ్ఞతను తెలిపిరి

ఆహ్వానసంఘాధ్యక్షులగు శ్రీ రాయోగణపతిలాల్ గారు అధ్యక్షులకును ప్రతినిధులకును ప్రతినిధులకును మహాసభ జయప్రదముగా నిర్వహించినందులకు కృతజ్ఞతను తెలిపిరి అధ్యక్షును, శ్రీముఖులను పూలమాలలచేసత్కరించిరి

సభపిమ్మట అధ్యక్షులతో సహా ప్రతినిధులఛాయాపటము గైకొనబడెను

మహాసభ ౫గంటలకు జయప్రదముగా ముగిసెను

## నూతిలో శవము

(విలేఖరి)

నిర్మల ౨౦-౧౧-౩౬

ఈగ్రామమున ఒకబాటసారికి పూరిబయట నూతిలో ఒకశవము గోచరమయ్యెను అతడు గ్రామమునకు పరుగెత్తుకొనిపోయి పైవార్త గ్రామాధికారికి విన్నపరచెను శవమును పరీక్షించిచూడగ గ్రామవాసుడగు రామచంద్రమనే వాడిదానుగని వెల్లడియయ్యెను అతని భార్య పుత్రులను అచటికరప్పించి విచారణచేయగ ౧౫ నవంబరు నాటిఉదయము యథాప్రకారముగ బయలుభూమికివెళ్లెనని వివరపరచిరి గ్రామాధికారి జరిగినతాలూకా ముంతజింకోత్వాలుగారికి పైవార్త తెలియపరచెను ౧౯ నవంబరు రోజు ముంతజింగారువచ్చి "బయలు భూమికివెళ్లి కాలుజారి నూతిలోపడి" నట్లు పంచాయతి తీర్మానంచేసి శవమును ఉత్తరక్రియలకొరకొప్పుటకు అనుమతించినట్లు తెలియుచున్నది.

# నిర్బంధప్రారంభ విద్యావిధానముపై

# అనామకుల ఆక్షేపణలు

## ప్రజాపక్ష విద్యామహాసభలో నాయకుల సమాధానము

గతసంచికలో (౧౯ తై ౧౩౪౬ఫ) వచ్చిన ప్రజాపక్ష విద్యామహాసభయొక్క మొదటిరోజు కార్యక్రమములో కొంత వదలివేయబడినది అను ౧ధమయొక్క రెండవపుటయందు రెండవకాలంలో "వయోజనవిద్య" అను శీర్షికక్రిందనున్న ఐక్యముపూర్తిగా కలిసినట్లున్న భాగము నిర్బంధ ప్రారంభవిద్యనుగూర్చి మౌల్వీ అక్బరు అలీఖాన్ గారి ఉపన్యాసముగదా అఉపన్యాసమును పోయినసారి వదలినభాగముతో కలిపి సంపూర్ణముగ పాఠకులకు చిక్కలేకుండుటకై, ఇపుడు ప్రకటించుచున్నాము. ఇదే నిర్బంధ ప్రారంభవిద్యపై ఉపన్యసించిన శ్రీయుతులు కొండావేంకటరంగారెడ్డి బూర్గుల రామకృష్ణారావు గారల ఉపన్యాససారములును ఇపుడు ప్రకటించ బడుచున్నవి ఈతీర్మానము అయినతరువాత ఆయుర్వేదమునుగూర్చిన తీర్మాన మామోదించబడి యుండెను దీనికిగూర్చిన ఉపన్యాససారములను ఇపుడుదిగువ ప్రకటించబడుచున్నవి —

"శ్రీ రామచంద్రనాయకుగారి ప్రతిపాదనను బలపరచుచు మౌల్వీ అక్బరుఅలీఖాన్ గారు రాష్ట్రము నందంతటను ఉచిత, నిర్బంధప్రారంభ విద్యాప్రదానశాసనము అమలులోనికి రావలసిన అవశ్యకత నిరూపించిరి "నిర్బంధవిద్యాప్రదాన శాసనమునకు వ్యతిరేకులుగా నున్నవారు మనరాష్ట్రముకంటె యెన్నియోరెట్లు అభివృద్ధి చెందియున్నట్టియు, మనకుమార్గదర్శకమైయున్నట్టియు బ్రిటిష్ఇండియాయందే యీశాసనము లేనప్పుడు మనకేమంత యావశ్యకమని అనుచున్నారు కాని యీశాసన మవసరమా? అనవసరమా? లాభదాయకమా? నష్టదాయకమా? అని ఆలోచించుటలేదు బ్రిటిష్ఇండియాయందు శాసింపబడియుండిన యన్నిశాసనములనుమనరాష్ట్రమునందుండవలసిన యవసరములేదు బ్రిటిష్ఇండియాయందు లేకుండినట్టియు మనరాష్ట్రాభివృద్ధికావశ్యకమైనట్టియు శాసనములను మనము గావించుకొనుటయందు మనకెట్టి యాటంకమునులేదు కావునయీశాసనము మనరాష్ట్రమునందు విద్యావిహీనతను పారద్రోలుటకై గావింపవలసిన యావశ్యకత యున్నది

శాసనము కూడదనెడు వారిరెండవఅభ్యంతరము విద్యావంతులసంఖ్య పెరిగెడిచో నిరుద్యోగసంఖ్య పెంపొందునని యు, గ్రామములందుగల రైతాంగము, వణిజులుమొదలగువారందరు ఉద్యోగములకొరకు హైదరాబాదు వచ్చిచేరెదరనియు అట్టిసందిగ్ధపరిస్థితులను తొలగించుటకు రాష్ట్రియుక్తపడవలసివచ్చునియు తెలుపుచున్నారు కాని యిదిదూరదృష్టిలేనట్టియు, భ్రమచేతనింతనిండి యుండినట్టి విషయము దూరదృష్టిగల మనప్రభుత్వమువారిటీవలనే యుటీలిటీకమ్మీలను రూపుమాపుటకు మెకంజీకమిటీవారి సూచనలను అంగీకరించియున్నారు ఆసూచనల ప్రకారము వ్యవసాయ, పారిశ్రామికవిద్యకు ప్రాముఖ్యత యొసగబడిన, విద్యావంతులగు వ్యవసాయకులు సుఖజీవనమును గడపుటకు మూలకందములగు గ్రామములందు వ్యవసాయము చేసికొనుచు హాయిగాగడపుటకు బదులు హైదరాబాదునగరమునకువచ్చి నిరుద్యోగులుగానుండి కష్టములపాలగుటకు యొప్పుకొందురా? గ్రామపరిశ్రమల పెంపొందించి లాభమును సంపాదించుట కనువగు విద్యనబడసిన విద్యావంతులు నగరమునకువచ్చి నిరాశ్రయులైయుండి కష్టములపాలగుట కిష్టపడుదురా? ఆలోచించుడు విద్యాప్రదానోద్దేశ్యము నిరుద్యోగసమస్యను అభివృద్ధిచేయుటకుగాక విద్యావంతులసంఖ్యను వృద్ధిజేసి రాష్ట్రీయుల దారిద్ర్యమును నశింపజేయుటకే నైయున్నది

ఈశాసనమును కూడదనెడువారు మరియొక విచిత్రవాదనను గావించుచున్నారు విద్యావంతులసంఖ్య వృద్ధియయ్యెడిచో రాష్ట్రీయులందభిప్రాయభేదములు పెంపొంది దేశమునందు అంతఃకలహములు చెలరేగునని వాదించుచున్నారు ఇంతకంటె కుతర్కము మరొకటిలేదు దేశీయులకు తమజడత్వము సంకుచితభావము విద్యావిజ్ఞానమువలన నశించిపోయినపుడు వారియందు తమదేశముపై దేశీయులపై యభిమానము వృద్ధియగునేకాని అంతఃకలహములు కలుగజాలవు ఒకవేళ విద్య, విజ్ఞానములవలన విబేధములు సంభవించినచేమను దానికివ్యతిరేకుడనేనైయుండు వాడనుగాని దానియుద్దేశ్యము హైదరాబాదీయులందు ఐక్యముస్థిరము చేయుటయే యైయున్నది. పూర్వాచారములను పెంపొందించుటయైయున్నది అభిప్రాయైక్యతను, జాతీయైక్యతను అభివృద్ధిగావించుటయైయున్నది

అందుచే యీశాసనము వెంటనే అమలుపరచుట యందెంతలాభ మిమిడియున్నదో మీరు గుర్తించినారు కావున నిప్పుడు మీరీతీర్మానమామోదింపవలయునని కోరుచున్నాను" అని తెలిపిరి

శ్రీ కొండా వేంకటరంగారెడ్డిగారు తీర్మానము నామోదించుచు రాష్ట్రమునందెన్ని సంస్కారములుగావించినను విద్యాప్రాబల్యము లేనిచో వానివలన రాష్ట్రీయులు లాభమును పొందజాలరనియు, విద్యాప్రాబల్యము గావలయునన్న నిర్బంధవిద్యాశాసనము గావించుట తప్పనిసరియనియు, ౧౯౧౮ సంll మున బ్రిటిష్ఇండియాప్రభుత్వమువారిచే నెలకొల్పబడిన రాయల్ కమీషన్ వారు దేశపరిస్థితులను వివరముగా పేర్కొనుచు దేశము క్షీణదశయందుండుటకుకారణము దేశీయుల విద్యావిహీనతయేనని స్పష్టపరచుచు దేశమునందంతటను నిర్బంధవిద్యాప్రదానశాసనము అమలులోనికి తేవలయునని తెలిపిరనియు, నిజాంరాష్ట్రమునందు రాష్ట్రీయుల అభివృద్ధిపథముప్పులనుగూర్చి ఆలోచించుటకు కనుక్కొనకుతలయున్న ... నిరక్షరాస్యులై పట్టభద్రుల నిరుద్యోగులై, నిరుద్యోగ ... సమస్యలున్నవనియు ... వాసవర్ధన మనదయినస్థానములో దేశమునందు నిర్బంధవిద్యాప్రదానశాసనము సాధనతోనే దానిని తీర్మానముగా ... నియమించడినవనియు, ఇదియే మునుపటి ప్రజాప్రాముఖ్యమంతయు లేనివిద్యాభివృద్ధికై నిర్బంధవిద్యాప్రదానశాసనము కావలయునని కోరుచున్నారని స్పష్టపడుచున్నదనియు, అందువలన ప్రభుత్వమువారు యీశాసనము వెంటనేగావింపవలయునని ప్రభుత్వమువారిని గోరవలసియున్నదనియు నుడివిరి

శ్రీ బూర్గుల రామకృష్ణారావుగారు ఉపన్యసించుచు శ్రీ కీll శేll వామన నాయకుగారును, మౌల్వీ అక్బరు అలీఖాన్ సాll గారును శాసనసభలో నిర్బంధ విద్యాప్రదానశాసనమును ప్రవేశపెట్టిరనియు కొందరు అనామకవ్యక్తులు దీనిని గూర్చి వ్యతిరేకాభిప్రాయమును తెలుపుచు ప్రభుత్వమువారికి విన్నపము పంపుకొనిరనియు, అందు శాసనముగూడదని తెలిపిన అభ్యంతరములు చిత్రముగాను, గర్హ్యముగాను యున్నవనియు తెలిపిరి

శ్రీ రామకృష్ణారావుగారు విన్నపమునందలి అభ్యంతరములకు వివరముగా ప్రత్యుత్తరమొసగుచు యీశాసనమువలన నిరుద్యోగత ప్రబలదనియు, దీనివలన రైతులపై దౌర్జన్యము గావించుట రాజాలదనియు తెలిపిరి

శ్రీమతి సుశీలాదేవి ఘాటకుగారు బాల, బాలికలకు విద్యనిర్బంధశాసనము గావించివేయవలయునని కోరుచు యుపన్యసించిరి.

తీర్మానము యేకగ్రీవముగా అంగీకరింపబడెను

### ఆయుర్వేద వైద్యవిద్య

శ్రీ హకీంరామకిష్టయ్యగారు ఆయుర్వేదవైద్యవిద్యా ప్రాముఖ్యతను వివరించుచు దిగువ తీర్మానము ప్రవేశపెట్టిరి

౫ "ఈమహాసభవారు ఆయుర్వేదవైద్యవిద్యాప్రదానముకంక ప్రభుత్వమువారి దృష్టిని ప్రసరింపజేయుచు వైద్యవిద్యాప్రదానముకొరకు నగరమునందొక కళాశాలయు, రాష్ట్రమునందలి వివిధప్రదేశములందు ప్రాథమిక పాఠశాలలును స్థాపింపబడవలయునని అభిప్రాయపడుచున్నారు"

తీర్మానమును శ్రీ గోపాలశాస్త్రిదేవుగారు ఆమోదించుచు క్లుప్తముగా నుపన్యసించిరి

తీర్మానము యేకగ్రీవముగా అంగీకరింపబడెను

# తెలంగాణా వార్తలు

## గద్వాలలో ముల్కీ తత్వము

### సంస్థానాధీశులు తమ ప్రజలకే ఉద్యోగము లిప్పించ నిశ్చయించుట

గద్వాల ౧౬—౩—౨౬ ఫ

ఇంతవరకు ఈ సంస్థానమందు ఉద్యోగము లు చాలవరకు యితర గ్రామముల వారికే యిచ్చు చుండిరి. కాని యిప్పుడు సంస్థానాధీశ్వరులు ఉద్యోగములను తమ సంస్థానములోని గ్రామముల వారికే యివ్వదలచి తే ౧౦—౩—౨౬ ఫ, దా రు ఇ క్క డి వి ద్యా వంతులైన యువకులలో యిద్దరిని తాలుకుదారుగారు పోలీసుపని నేర్చుకొనుటకు పంపిరి ఈ యువకులు పరీక్షలైన తదుపరి సంస్థానమందు పోలీసు సబుయినస్పెక్టరులుగా నియమింపబడుదురు ఇకముందు కూడ ఉద్యోగములు చాలవరకు సంస్థానమందలి విద్యావంతులకే యివ్వబడునని సంస్థానాధీశ్వరులు దృఢపరచుకొనియున్నారు వీరికి యిట్టి దేశాభిమానము కలిగినందుకు భగవంతుడు ఆయురారోగ్యము లిచ్చి కాపాడుగాక

—

## నైజాం రజతోత్సవ వైద్యశాల

మ్యాఖంధాల్, ౧౯ నై

ఈ గ్రామము రాయచూరు జిల్లా లింగ్సుగూరు తాలూకాకు ౩౨ మైళ్ళ దూరమున నుండు ముఖ్య గ్రామము గృహసంఖ్య —౫౫౨, జనసంఖ్య ౧౩౪౦ కలదు ఇట ముక్తేదారుగారిది నొక బాయిలర్ ఫ్యాక్టరీకలదు రజతోత్సవ చిహ్నముగా నొక వైద్యశాల నిర్మించుచున్నారు భవనము పూర్తి కావచ్చినది. ఈ గ్రామములో వైద్యశాల ముఖ్యావసరమై యుండెను ఇటీవల నేలో కల్యాండుబారు ఒక సభను నిర్మించియున్నారు ముక్తేదారుగారు రైతులను చాలాదయతో చూతురు

ఒక పాఠశాల కూడ కలదు ౧౩౦ మంది విద్యార్థులు గలరు, మూడు సంవత్సరములకు పూర్వము ఈ పాఠశాల ఎత్తివేయవలసి వచ్చునంత దుస్థితికి వచ్చియుండెను కాని హనుమంతరావు గారు అను ఉపాధ్యాయులు వచ్చిన తర్వాత చాలవరకు ల్యాంపువకు రాగలిగినది పాఠశాల భవనము బాలుర సంఖ్యకు తగినట్టుల లేదు పునరుద్ధరణకై ప్రభుత్వము వారి దృష్టికి రావలసినది ఈ పాఠశాల క్రింద నొక క్రీడావినోద మైదానమొకటి గలదు ముక్తేదారుగారు పారిశుద్ధ్య విషయములో చాలా శ్రద్ధ తీసికొందురు అయినను యింకా పారిశుద్ధ్యము అవసరము

—

## బాటల సౌకర్యములు

సిద్దిపేట ౧౬ నై

పారిశుద్ధ్యము గురించి చెప్పవలెనంటే చాలా చెట్టలేలుగా యున్నది శీతోష్ణస్థితులు మారుటచే జ్వరములు విజృంభించి కొన్ని మరణములు కూడ సంభవించినవి ఆజూలనుమాసాంతమువరకు వర్షములు మిక్కిలిగా యుండెను చెఱువులు నిండినవి కాని చాలావరకు ఇండ్లు నేలమట్టమయినవి ఇక వ్యవసాయపు పనులకు ఆటంకము లేదని తలంచుచున్నారు

ఆలేరు పనకు బాగుగా లేకుండుటచే వర్షము అవలన బస్సులకును ప్రయాణీకులకును చాలా యిబ్బందులు కలుగుచున్నవి బాటమధ్యలో గల నదులచే ఒక్కొక సమయమున చాలా కాలము బస్సులు ఆగియుండును అప్పుడు ప్రయాణీకులకు కూడా చాలా కష్టములు కలుగుచుండును

—

## వ్యవసాయకుల దుస్థితి

వేముల ౧౬ నై

ఈ గ్రామము మహబూబునగరమునకు ఆరు మైళ్ళ దూరమున కలదు గ్రామములో పారిశుద్ధ్య పు ఏర్పాటులు ఏమాత్రము లేవు మంచినీళ్ళ బావులు పూడియుండుటచే చాలావరకు పునరుద్ధరణ ము త్యవసరము వ్యవసాయ పరిస్థితులు చాలా క్షీణముగా నున్నవని తెలియుచున్నది సర్కారు పన్ను చెల్లించుశక్తి లేనివారుగా నున్నారు వ్యాపార పరిస్థితులు కూడా ఏమి బాగుగా లేవు బీద జనసంఖ్య మిక్కిలిగా గలదు పట్టణము కొందుకు తమ వ్యాపారము సెగ్గక గ్రామములను వదలవలసినవారగుచున్నారు ఈ గ్రామములో పాఠశాల గ్రామకంఠమునకు వెలుపల గలదు ఈ గ్రామ ప్రజలకు విద్యాపేక్ష లేదు

—

## మాణవిలో నీటి సౌకర్యములు

—

మాణవిలో బావులు ఏర్పరచు శాఖ అధికారిని విచారించగా ఇటీవల ప్రభుత్వము చే త్రవ్వింపబడిన బావులు పట్టణమునకు మారముగ నున్నవనుమాట నిజముగాదని తెలిసినది నిజముగా ఈ బావులు జన నివాసస్థలములలోనో లేక గ్రామ పరిసరమందో సులభమైన అందుబాటులో నే గలవు అని ప్రకటన శాఖవారు ౧౫౨జూను ౧౯౩౬ నాటి మా గోలికొండపత్రికలో వచ్చిన "మాణవిలో కరవు" అను వార్తకు ఖండనగా మాకు తెలిపిరి

—

### చందాదారులకు మనవి

పోయిన బుధవారమునాడు మా ముద్రణ యంత్రము (పవరుప్రెస్సు) చెడుటచే, దానిని బాగుచేయుట నిన్నసాయంకాలమునాటికిగాని పూర్తికానందున, గతగురువారమునాడు పత్రిక ప్రకటింపబడలేదు దీనికిక్షంతవ్యులము

వ్యవస్థాపకుడు.



# గోలకొండపత్రిక

యువ నామసం॥ర కార్తీక బ॥ ౧

సోమవారము



## ప్రజాపక్ష విద్యామహాసభ

౧

మూడవ హైదరాబాదు ప్రజాపక్ష విద్యామహాసభయొక్క కార్యవిధానము తుదకు మహోత్సాహముతో నిర్విఘ్నముగనెరవేరినందువలన, రాష్ట్రీయ విద్యాభిమానులందరును మొదట మొదట ఈమహాసభను జరుపుటకు సంభవించిన ఆటంకములను మరచి సంతోషము వహించవచ్చును ఈమహాసభవారు ఆమోదించిన తీర్మానములన్నియు అధ్యక్షోపన్యాసమందు సూచింపబడిన మార్గమునే అనుసరించుచున్నవి. అధ్యక్షులవారును నేడు మనరాష్ట్రమందు విద్యావిషయమున కలవరపెట్టుచున్న సమస్యలన్నింటి చిక్కులవిడదీసి కర్తవ్యమును స్పష్టమగునట్లు నిరూపించిరి

మనరాష్ట్రమందు ఇపుడు విద్యావిషయమునగల సమస్యలలో ముఖ్యాతిముఖ్యమైనది విద్యావ్యాప్తి ఏటేట విద్యకై చేయబడుఖర్చు అంతకంతకు హెచ్చుచున్నను, ఆఖర్చు ఎంతవేగముగ హెచ్చుచున్నదో అంతవేగముగ రాష్ట్రమందలి విద్యార్థులసంఖ్య హెచ్చుటలేదు మనరాష్ట్రవిస్తీర్ణములోపదియవభాగముకంటెతక్కువవిస్తీర్ణముగల మనరాష్ట్ర జనసంఖ్యలో సగముకంటెఎక్కువజనసంఖ్యయుగల తోడిసంస్థానమగు తిరువాన్కూరులో విద్యావంతులసంఖ్య —పోయిన జనపరిగణనప్రకారము— మొత్తము జనసంఖ్యలో—ప్రతిశతి ౨౦ మందియుండగా, మనరాష్ట్రములో విద్యావంతులసంఖ్య ప్రతిశతి ౫మందికంటె ఎక్కువలేదను విషయము రాష్ట్రాభిమానియగు ఎవనికి విచారము కలిగించకుండును మనరాష్ట్రములోనేడు సామాన్యజనులనేకులు అనుభవించుచున్న కష్టములనుండి తప్పించుకొనుటకు సరియైన ప్రయత్నములను వారలు చేయకుండుటకు మూలకారణమగు లోపము సామాన్య ప్రపంచజ్ఞానమునిచ్చు విద్యయైనను వారలందు లేకుండుటయేయని చెప్పవచ్చును. ప్రభుత్వమువారియొక్క వ్యవసాయశాఖ మున్నగు అనేకములగు అభివృద్ధిశాఖలు జనసామాన్యమును వారల దుస్థితినుండి ఉద్ధరించుటకై చేయుచున్న ప్రయత్నములు వేవేగముగ తగినంత సాఫల్యము పొందకుండుటకు ఆసామాన్యజనుల మౌఢ్యమేనని ఆయాశాఖల ప్రభుత్వాధికారులే అనేక సందర్భములలో అంగీకరించియున్నారు. కనుక మనరాష్ట్రమందు జనుల హీనస్థితినితగ్గించి సౌఖ్యమును వ్యాపింపజేయుటకు ప్రథమకర్తవ్యము విద్యావ్యాప్తియగుచున్నది. కనుక ప్రజాపక్ష విద్యా మహాసభాధ్యక్షులవారు తమఉపన్యాసమందు విద్యావ్యాప్తికి విశేషస్థానమిచ్చుట సమంజసముగనున్నది

మన విద్యాశాఖవారు మొదట విద్యావ్యాప్తివిషయమై శ్రద్ధవహించుండిరికాని తర్వాత కొంతకాలమునుండి ఇప్పటికిని విద్యను ఇంకను ఎక్కువగ వ్యాపింపజేయుటకంటె, వ్యాపింపజేసినంతవరకు మంచి కట్టుదిట్టములు అలంకారములుచేయుట శ్రేష్ఠమనుపద్ధతి నవలంబించుచున్నారు. విద్యఇంకను అధికముగ వ్యాపించవలసియుండగా ఈపద్ధతి నవలంబించుట యుక్తముకాదనియు, తిరిగి ప్రభుత్వమువారు విద్యావ్యాప్తికై శ్రద్ధవహించవలెననియు అధ్యక్షులవారు సూచించిరి. ఈవిద్యావ్యాప్తికి మార్గములుగ నిర్బంధోచిత ప్రారంభవిద్య, ఖాన్గీపాఠశాలల ప్రోత్సాహము, మాతృభాషలో విద్యనేర్పుపద్ధతిని అథమపక్షము సెకండరీవిద్యదశ పూర్తియగువరకైనను అవలంబించుట, వయోజనవిద్య— సూచింపబడినవి

నిర్బంధ ప్రారంభ విద్యావిధానలోను అమలుపరచు విషయమున ద్రవ్యముపము మున్నగు అనేక కష్టములున్నవి గనుక ప్రభుత్వమువారు ఇప్పట్లో ఆవిధానము నవలంబించజాలరు అని ఇటీవల హైదరాబాదు ఉపాధ్యాయమహాసభలో విద్యాశాఖ మంత్రియగు నవాబు మెహిదియారుజంగు బహదరుగారు చెప్పియుండిరి అందు ద్రవ్యలోపమను ఆక్షేపణకు సమాధానమిచ్చుచు అధ్యక్షులవారు సూచించినమార్గము గమనించదగినదిగనున్నది ఉన్నతవిద్యకై చేయబడుచున్న ఖర్చులో కొంత తగ్గించవచ్చుననియు, ప్రతిసంవత్సరము విదేశములలోని విద్యాసంస్థలకు ఒసగబడుచున్నవిరాళములను మానకొనవచ్చుననియు, సంస్థానము వెలుపలివారికిచ్చు దానములను నిలిపివేయవచ్చుననియు వారు సూచించిరి ఈచెప్పినద్వారముల మనరాష్ట్రములనుండి ఎంతద్రవ్యము, మన అతిముఖ్యావసరము తీరకయుండగా, బైటికిపోవుచున్నదో ఒకటిరెండు ఉదాహరణములను చూపించెదము. ౧౩౪౬ఫ. లో ఢిల్లీలో 'న్యూచర్చి'కై ౧౫ వేలు, ౧౩౪౩ఫ.లో మదనపల్లి కళాశాలకు ౫ వేలు, పాటైపైన విశ్వవిద్యాపీఠమునకు ౧ లక్ష ౧౭ వేలు, టాగూరుగారివిద్యాపీఠమునకు ౨౨వేలు—ఇవిఖర్చైనవి ఖర్చైనదానికింకను లెక్కతేల్చబడక మంజూరుమాత్రము చేయబడినది ౧౩౪౫ఫ లో ఢిల్లిలో 'ఏదో ధర్మకార్యానికి'౧/3 లక్షలు, కీ॥ శే॥ జార్జిచక్రవర్తిగారి విగ్రహనిర్మాణమునకును విలింగ్డను ప్రభువుయొక్క పటమునకును కలిసి ౧/3లక్షలు దీనిమొత్తమంతయు దాదాపు ౨లక్షల౨౭వేల రూపాయలగుచున్నది. ఇవిబడ్జెటులో స్పష్టముగ చెప్పబడినట్టివి ఇట్లువివరముగ చెప్పబడక ,సామాన్యముగ విరాళములనిచెప్పబడినట్టి మొత్తములలో రాష్ట్రమువెలుపలికిపోయిన దెంతయో తెలియదు. మరి కొన్ని యితరములైన అసాధారణవ్యయములనుండియు ఎంతయో రాష్ట్రమందు నిర్బంధప్రాథమిక విద్యావిధానము నవలంబించుటకై వినియోగించవచ్చును. కాబట్టి ఇతరరాష్ట్రములు నష్టపు బడ్జెట్లతో చిక్కుపడుచుండగా మనరాష్ట్రమునకుఅట్టిచిక్కురానీయకుండుటయే గాక, ఖర్చులుపోను నిలవకూడచూపించగల్గుచున్నట్టి సమర్థుడగుఆర్థికమంత్రిగారిపరిపాలనలో, ప్రభుత్వమువారుకూడ అతిముఖ్యమని అంగీకరించు నిర్బంధ ప్రాథమికవిద్యావ్యాప్తికి తగినంతద్రవ్యములేదనుట ఎంతమాత్రమును గౌరవమునకు తగినదికాదు మన ఆర్థికశాఖామాత్యులవారు పట్టుబట్టినచో చాల హెచ్చుగనుండు జీతములను తగ్గించుటకు మాత్రమేగాక ఇతరవిధముల అనేక ప్రభుత్వశాఖలందు ఖర్చులను తగ్గించుటకును ౧౩౪౪ఫ. బడ్జెటులో చేసిన సూచనలు అమలుజరిగి కొంత ద్రవ్యము మిగులగలదు. అదియును గాక ఒకటిరెండుసార్లు (౧౩౪౪ఫ బడ్జెటులో ఒకసారి) ఆర్థికమంత్రిగారు మనరాష్ట్రములో ఇతరరాష్ట్రములలోవలె ఆదాయపు పన్ను లేని సంగతినిఎత్తిచూపించుచున్నారు. కావున దానికి బదులు విద్యపన్ను నువారు ఏర్పాటుచేసి ప్రభుత్వాదాయమును వృద్ధిచేయవచ్చును. ఈవిధముగవచ్చు ద్రవ్యముతో నిర్బంధప్రాథమిక విద్యావిధానమును అమలుపరచవచ్చును.

ఉపన్యాసము ఆదాయపువన్నువలెనే ధనవంతులనుండి రాబట్టవలెను

---

ఐదవ ఆంధ్ర మహాసభ, మహిళామహాసభ

షాద్‌నగరం: (రైల్వేస్టేషన్)

౧౨,౧౩,౧౪ బహమన్, ౧౩౪౬ ఫ. (మార్గశిరశు॥ ౨-౩-౪) తేదులలో జరుగును.

అధ్యక్షుడు.

## శ్రీయుత కొండా వేంకటరంగారెడ్డిగారు హైకోర్టువకీలు

అధ్యక్షురాలు.

## శ్రీమతి బూర్గుల అనంతలక్ష్మీదేవిగారు

నిజాంరాష్ట్రాంధ్రులందరు పాల్గొనదగిన మహాసభ.

ప్రతినిధులు కాగోరువారు స్థాయిసంఘ కార్యాలయము (తూప్రబజారు) నందు పైకము చెల్లించి రశీదులు పొందవలయును పరస్థానికులకు భోజనాది సదుపాయము ఉచితముగా చేయబడును.

ఆహ్వానసంఘము.

| | |
|---|---|
| రాఘవేంద్రబాయి, అధ్యక్షురాలు | వేంకట నారాయణరెడ్డి, అధ్యక్షుడు. |
| కే సుశీలాదేవి, కార్యదర్శిని. | బూర్గుల వేంకటేశ్వరరావు, కార్యదర్శి. |

---

### హైదరాబాదు ఆయుర్వేద వైద్య సంఘము

#### కార్యనిర్వాహక సమావేశము

౨౭-౧౧-౩౬వ తేదీ శుక్రవారం మధ్యాహ్నం పై సంఘముయొక్క కా. ని. సమావేశము జరిగెను

కీ॥ శే॥ దేశభక్త వామన్నాయకుగారి ఆత్మశాంతిని, వారిబంధువులకు సమాశ్వాసమును ప్రతిపాదించుతీర్మానము ప్రవేశపెట్టబడిసభ్యులందరును లేచి మౌనముగాప్రార్థనసలిపిరి తరువాత ఐదునిమిషములు సమావేశము నిలుపబడినది పైతీర్మానములను కీర్తిశేషుల యొక్క కుమారులగు శ్రీయుత శ్రీధరనాయక్ బార్-ఎట్-లా గారికి పంపుటకుగాను అధ్యక్షుల కధికారము ఈయబడినది తరువాత నిటీవల జరిగిన ప్రజాపక్ష విద్యా మహాసభయందు (Peoples Ebucatonal Confernece) అంగీకరించబడినట్టియు శ్రీయుత"విషకశిరోమణి హకీంరామకృష్ణ (కార్యదర్శి నిజామ్ ఆయుర్వేదిక్ రిత్బెయూనాని సంఘము గారిచే ప్రవేశపెట్టబడినదియునగు ప్రభుత్వమువారిని సెంట్రల్ ఆయుర్వేద కళాశాలనేర్పరచి ఇతర రాష్ట్రములలోవలె నిచటకూడ ఆయుర్వేదశాస్త్రమును ప్రోత్సాహపరచుటకు ఈసభవారు కోరుచున్నారు, అంతియేగాక నిజాము రాష్ట్రమునందంతటను ఆయాప్రాంతీయభాషలలో (కన్నడ, మహారాష్ట్ర తెల్గు)కూడ ఆయుర్వేద విద్యాలయముల నేర్పాటుచేయవలెనని కూడ పైతీర్మానమునందు వివరింపబడెనని తెలియుచున్నది

ఆ తీర్మానము నంగీకరించినందులకై పై ప్రజాపక్షమహాసభవారికి మా హైదరాబాదు ఆయుర్వేదవైద్యుల సంఘము తరఫునుండి పునఃపూర్వకముగ ధన్యవాదము అర్పించుచు, ఈసభవారు తీర్మానించుచున్నారు. ఈ తీర్మానం ఏకగ్రీవముగ నంగీకరింపబడినది.

డా॥ ఆచార్య,

ప్రచురణ శాఖాధికారి.

# శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయం

[హైదరాబాదు రెషిం]

కార్యనిర్వాహకవర్గపు ఎన్నికలు

ఆదివారము (22-11-1936) సాయంత్రము 6-30 లకు ఈక్రిందివారు మహాజనసభవారిచే నూతనసంవత్సరమునకు కార్యనిర్వాహకవర్గము గా ఎన్నుకొనబడిరి

అధ్యక్షులు — శ్రీశ్రీ రాజా నాయని వెంకట రంగారావు బహద్దరువారు (మునగాలసంస్థానాధీశులు) ఉపాధ్యక్షులు శ్రీపింగిళి కోదండరామరెడ్డిగారు (దేశముఖులు) శ్రీఅక్కినేపల్లి జానకిరామారావుగారు (జాగీర్దారు), కార్యదర్శి శ్రీఆచార్యఖండవిల్లిలక్ష్మీరంజనంగారు యం ఏ సహాయకార్యదర్శి శ్రీకస్తూరి కిషన్ రావుగారు, గౌరవ గ్రంథపాలకులు శ్రీసంగిశెట్టి బసవయ్యగారు,

అనధికారసభ్యులు

శ్రీయల్లాప్రగడ సీతాకుమారిగారు, శ్రీయల్లాప్రగడ నారాయణరావుగారు, శ్రీ భాస్కరభట్ల కృష్ణారావుగారు, శ్రీ మాడపాటి హనుమంతరావుగారు [వకీలు] శ్రీ బూర్గుల రామకృష్ణారావుగారు, [బి ఏ,ఎల్ ఎల్ బి] శ్రీకలువకొలను వెంకటరావ శాస్త్రిగారు, శ్రీ పి వి రామారావుగారు, శ్రీ అవసరాల అనంతకామేశ్వరరావుగారు

---

## మసీదులనుండి ఇండ్లకుపోవుటకు సర్కారీ బస్సులు దొరకలేదను మొఱ

హైదరాబాదు ౨౭ తై

గతశుక్రవారము హైద్రాబాదు మసీదులలో నమాజుచదివినవారు తిరిగి తమయిండ్లకు వెళ్లుటకై సర్కారీబస్సులుదొరకక చాలపడిన యిక్కట్లు మతశాఖాధ్యక్షులవారికి విన్నవించుకొనిరి అధ్యక్షులవారు బస్సులకార్యస్థానమునకు వ్రాసి తెలిసికొనగా వారుప్రత్యేకముగా తగు ఏర్పాటు గావించితిమని వ్రాసిరి ఈసంగతి మహమ్మదీయులకు తెలియపరచుచు, ఇకముందు రంజాన్ నెలలో ప్రతిశుక్రవారము మోటారుబస్సుల ఏర్పాట్లు యుండునని మతశాఖాధ్యక్షులవారు ప్రకటించిరి

---

## గోలకొండ వ్యాపారుల మహాజనసభ

గోలకొండవ్యాపారుల మహాజనసభ వార్షికోత్సవము శ్రీయుత బూర్గుల రామకృష్ణారావుగారి యాధిపత్యమున తా॥ ౨౨-౧౧-౧౯౩౬ ఆదివారము సాయంత్రము ౭ గంటలకు కొంపల్లి రామచంద్రరావుగారి దేవాలయమున జరిగెను అని బి వి రామారావుగారు (గౌ కార్యదర్శి గోలకొండవిద్యార్థి వసతిగృహ సభ) తెల్పుచున్నారు

---

## ఆంధ్రబాలికల పాఠశాల, గోల్లకిటికి

దోమకొండ సంస్థానాధీశులగు రామేశ్వర రావుబహద్దర్ గారు ఈపాఠశాలకు నెల ౧కి ౫ రూపాయలు అనుగ్రహించుచున్నారు

ఇదిగాక బాలికల కృష్ణలీల ప్రదర్శనము చూచి ఆనందించి, ఈక్రింద నుదహరించినవారు నెల ౧కి ౧ రూపాయచొప్పున చందా దయచేసియున్నారు —

మ రా శ్రీ గొల్యాల వెంటయ్యగారు [ఓవర్సీర్ అరాయిషుబల్దే]

" డాక్టర్ నరసిహ్మాచార్యులగారు [గౌలీగూడెం]

" రంగయ్యగారు [హెడ్ బ్రాంచి, షేకుమిషవర్ ప్రమ్ జారు]

" పాపయ్యగారు [ఉద్దుబజారు]

బి మాధవయ్య
కార్యదర్శి, పాఠశాల

---

## దారిద్ర్యఫలితమగు ఘోరకుటుంబనాశము

రోహతకుజిల్లాలోని అంబలీ గ్రామమునందు ౧౬వ నవంబరు తేదీనాడు ఒకతండ్రి భరించరాని పేదరికముచేత తన నలుగురుకుమార్తెలనరికి తాను ఉరిపోసుకొని మరణించెను జరిగిన కథ ఈప్రకారమున్నది. అయూడీయందు అన్నదమ్ములిద్దరు వేరువేరుగా కుటుంబముతో నుండిరి పెద్దవానికి నలుగురుకుమార్తెలు అత్యంత పేదవాడు చిన్నవానికి సంతానము లేదు అత్యంతధనికుడు పెద్దవాడు తనసంతానముతో సహా మూడురోజులు తిండిలేక ఉపవాసముచేసి చాలఃగపడినను తమ్మునివద్దకు వెళ్లి సహాయము కోరెను తమ్ముడు అతనికొకమూటడు గోధుమ పిండి ఇచ్చెను కాని చిన్నవానిభార్య బావగారిచేతినుండి పిండిమూట ఊడలాగికొని పొమ్మనెను దరిద్రముచే క్రుంగిపోయిన పెద్దవాడు మరదలుచేసిన అవమానము సహించలేకను, తిండివచ్చు నుపాయము గానకను ఆనాటి రాత్రి సమయమున నిద్రించుచుండిన నలుగురుకుమార్తెలను కత్తితో తెగనరికి తాను ఉరిపోసుకొని మరణించెను మరుసటిరోజున ఈసంగతి తమ్మునికెరుకఆయెను అతడు తనఅన్నయొక్కయు, బిడ్డలయొక్కయు మృత్యువునకు కారకురాలు తనభార్యయేయని నిశ్చయించుకొని పట్టపగలు అతడు తనభార్యను కత్తితో ముక్కలుముక్కలుగా నరికెను అతడు అధికారులయెదుట అపరాధ మొప్పుకొనెను

---




**501 సబ్బు**

వల్ల డబ్బు మిగులును, గుడ్డలు చాలకాలము ఉండును, పనితగ్గును

"చాకలివాడనుకున్నావా' కాదు కాదు వీటి నన్నిటిని నేనే నెం **501** సబ్బుపట్టించి శుభ్రముచేసికొనుచున్నాను

టాంకో సేల్సుడిపో



యూసుఫ్ బిల్డింగు నారాయణస్వామి హైదరాబాద్ -ద.

టాటా ఆయిల్ మిల్సు కంపెనీ, లిమిటెడ్, టాటాపురం మరియు బొంబాయి

---

ఐ యం. యస్ డాక్టర్లచేసిఫారసుచేయబడినది.

## బాట్లివాలా ఎగ్యూ మిక్శ్చర్

మరియు ఎగ్యూ మాత్రలు

మలేరియా, ఇన్ఫ్లూయెంజా, ప్లేగు, మరియు టైఫాయిడ్ అన్నిరకముల జ్వరములకు బాట్లివాలా టానిక్ మాత్రలు (తెలుపు-రాజా) (నపయోగపడునుపొందుటకు) జ్వరమువచ్చిపోయిన తర్వాత ఏర్పడుచుండు బలహీనతకుగానిపటుత్వమును, బలమును ఇచ్చును

ముసలివారలను యువకులనుగ చేయును

దీని నమ్ముటకు సంపూర్ణాధికారముగల ఏజంట్లు —

**పి యం. పట్నిఅండుకో**    ప్రిన్సెస్ స్ట్రీటు బొంబాయి, 2.

Tel Address --Ligature    Tel Address -Cawashabad

---

సక్రమముగాను జయప్రదముగాను అభివృద్ధిచెందుచుండిన

## పాపులరు యిన్సూరెన్సుకో, లిమిటెడ్

హెడ్ ఆఫీసు — మంగళూరు. ద. ఇండియా

**బోనసు**
31—12—34 మొదటి
వాల్యూయేషన్ లోనే 1000కి
రు 10—0—0 లు తేలినది

**పాలసీ**
పాపులరుతో సమానమైన
సౌఖ్యమైన నిస్సంశయమైన
పాలిసీ యింకొకటిలేదు

పాస్పెక్టసు మరియు వివరములకువ్రాయుడు

హైదరాబాదురాజ్యముఆంధ్రదేశమునకు స్పెషలు ఏజన్సీలుఉదారమైన పద్ధతులమీద అనుభవముకలవారు కావలెను.

మ్యానేజింగు డైరెక్టరు

---

### పంచసహస్ర దీపోత్సవము

మధిర తాలూకాలో చేరిన రాయపట్నంబున శ్రీ ధాతృనామసంవత్సర కార్తీక శు ౧౫ శనివారంబున శ్రీ వేణుగోపాలస్వామివారి దేవాలయములో పంచసహస్రకర దీపోత్సవము జయప్రదముగ జరుగగలదు

### కార్యక్రమము

౧౫ శనివారము సాయంత్రం ౫ గంటల లగాయతు ౧౦ గంటలవరకు ౫వేల దీపములు వెలిగించుట, నృత్యగీతాదులు భజన జరుగును.

రాత్రి ౧౦ గంటల లగాయతు ౧-౩౦ గంటల వరకు హరికథ

౧-౩౦ గంటల లగాయతు ఉదయం ౭-గంటల వరకు స్వామివారి గరుడోత్సవము కరదీపికలచే జయప్రదముగా జరుగును

ఇట్లు భగవద్భక్తుడు
శ్రీనివాసుల వేంకటాచార్యులు

---

## ఆంధ్ర ఇన్సూరెన్సు కంపెనీ (లిమిటెడ్)

మచిలీపట్టణము

మాపట్టాదారులకు యింకను హెచ్చు సౌకర్యములు:

(1) పట్టాదారులకు డైరెక్టర్ల స్థానములు రెండు ప్రత్యేకింపబడినవి.

(2) మూడువేల రూపాయిలకు పట్టాలను పొందిన వారందరు ఓటు చేయనర్హులు.

(ఇదివరలో రు 5000 లకు లాభములతోకూడిన పట్టాలను పొందినవారు మాత్రమే ఓటు చేయనర్హులు ఇప్పుడట్టి వివక్షతలేకుండా రు 3000 లకు ఏవిధమైన (కింద భీమా చేసినప్పటికి ఓటు చేయవచ్చును)

(3) పట్టాదారులున్వయముగా హాజరుకానక్కరలేకుండాప్రాక్సీద్వారా ఓటు చేయవచ్చును

సక్రమాభివృద్ధిగాంచుచున్న యీ ప్రథమాంధ్ర భీమాసంస్థయందే ఎల్లరును భీమాచేయ ప్రార్థితులు

అన్నిచోట్లను మంచి కమిషనుపై పలుకుబడిగల ఏజంట్లు కావలెను.

యర్రమిల్లి మంగయ్య బి. ఎ, బి యల్,
కార్యదర్శి

౧౯౩౪ ఫ. మై నెలలో సమావేశమైన రెండవమహాసభయొక్క ౧౫వ తీర్మానము ప్రకారము దిగువసభ్యులుగల స్థాయిసంఘము మేర్పరుప బడెను:—

౧. అధ్యక్షుడు శ్రీ డాక్టరు రాంప్రసాదు శ్రీవాస్తవ ఎం.ఏ.డి.ఎస్.ఏ.,(లండను)గారు.
౨. ఉపాధ్యక్షుడు: శ్రీ వామనరామచంద్రనాయకుగారు.
౩. కార్యదర్శి: శ్రీలక్ష్మణరావుగారు బి.ఏ.,ఎల్ ఎల్.బి.గారు.
౪. సంయుక్తకార్యదర్శి: మాడపాటిహనుమంతరావుగారు
౫. కోశాధిపతి: రాంచంద్రరావుఅంతుగారు

## నగర సభ్యులు

౬. పండిత కేశవరావుగారు [౭] మౌల్వీమహమ్మదు అలీసాహెబ్ ఫాజిలు,[౮] మౌల్వీఫజలుర్రహమాన్ సా॥ బి.ఏ ,[౯]శ్రీశ్రీనివాసరావుశర్మ బి.ఏ.,బారిష్టరు, [౧౦] శ్రీరామచంద్రనాయకు ఎం.ఏ.,బారిష్టరు,,[౧౧] శ్రీకాశీనాథరావువైద్య ఎం.ఏ.,ఎల్ ఎల్.బి.,[౧౨]శ్రీ దిగంబరదాసు చౌదరీగారు,[౧౩]శ్రీ చమనకరణ గారు.

## జిల్లాల సభ్యులు

[౧౪] శ్రీ గోవిందరావు నానల్ గారు,పర్బని, [౧౫] శ్రీరాజారాంపంతుగారు ఔరంగాబాదు, [౧౬] శ్రీజనార్దనరావుగారు గుల్బర్గా, [౧౭] శ్రీనారాయణరావు ఆయాచితుగారు ఉస్మానాబాదు, [౧౮] శ్రీమాదిరాజు రామకోటేశ్వరరావుగారు వరంగల్లు, [౧౯] శ్రీ ఎం. నారాయణరావుగారు మహబూబునగరం [౨౦] శ్రీపులిజాల వేంకటరంగరావుగారు నల్లగొండ.

శ్రీపండిత కేశవరావు, మౌల్వీ మహమ్మదు అలీఫాజిలు, పండిత దిగంబరదాసు చౌదరీగారల మరణమువలన వారిస్థానే శ్రీపండిత వినాయకరావు, మౌల్వీ అబుల్ హసన్ సయ్యదలీ,పండిత శ్రీనివాసరావు కొర్వాన్కరుగారలు యెన్నుకొనబడిరి. పైప్రముఖుల మరణమువలన స్థాయిసంఘము వారికి అధిక సంతాపము కలిగినది. ప్రత్యేకముగా పండిత కేశవరావుగారు యీ మహాసభను స్థాపించి, అధిక సానుభూతిని చూపిన వారలలో నొకరు. వీరి మరణమువలన మహాసభకు తీరని గొప్పనష్టము వాటిల్లినది.ఈనివేదికము ద్రణకు పంపుచున్నపుడు సంఘోపాధ్యక్షులగు ధర్మవీర, దేశభక్త శ్రీ వామనరామచంద్ర నాయకుగారు అకాలమరణమునకు పాలైరి. శ్రీవారికి విద్యాసమస్యలయందెట్టి అభిరుచియుండెడిదో అందరికిని విదితమే. మహాసభా ప్రారంభము నుండి వారు మహాసభయందు పాల్గొని చేసినసేవ దృశ్యమానమే. మొదటిమహాసభకు కార్యదర్శులుగాను, రెండవమహాసభకు ఆహ్వాన సంఘాధ్యక్షులుగాను యుండిరి. వారిచే ప్రవేశపెట్టబడిన నిర్బంధప్రాథమిక విద్యాప్రధాన చిత్తుశాసనము శాసనసభవారి ఆలోచనయందుగలదు. యీమహాసభ మూడవ సమావేశము త్వరలోనే జరుగనుండెను. ఇట్టి సమయమున శ్రీవారి మార్గదర్శకత్వము ప్రజల కత్యవసరమైయుండెను. పండిత కేశవరావు, దిగంబరదాసు చౌదరీ, వామన నాయకు గారలవంటి నేతలు కీర్తిశేషులగుటచే హైదరాబాదు ప్రజాహిత సేవయందు ఏర్పడిన ఖాళీస్థానము పూరితమగుట దుస్సాధ్యము.

రెండవమహాసభ సమావేశమైనపిమ్మట కొందరు ప్రముఖులు తమ యొక్క వ్యాపసంవత్సరము వరకు వెల్లడించిన భావములనుగూర్చి ప్రభుత్వమువారిపక్షమున ప్రచురింపబడిన ౧౯౩౦ ఫ. ఆబాను ౨౫వ తేదీనాటి యొక్క ప్రకటన ప్రచురింపబడెను. దీనికి యొక్క ప్రత్యుత్తరము స్థాయిసంఘపక్షమున ౧౯౩౦ ఫ. ౨౬వ తేదీనాడు (౧౯౩౦ నవంబరు ౭వ తేదీ) ప్రకటింపబడెను. ఇది రెండవ మహాసభయొక్క నివేదికయందు సంపూర్ణముగా ప్రచురింపబడెను.

రెండవ మహాసభయందు ఆమోదింపబడిన నియమావళి ననుసరించి విద్యామహాసభ సమావేశము ప్రతిసంవత్సరము జరుపబడవలెనని నిశ్చయింపబడియుండెను. కావున ప్రకృతము ను ద్ఘాటనము మహాసభను సమావేశపరచుటకు నిశ్చయింపబడెను. కాని కృషి ఫలితముగాక

# ప్రజా సంస్థల నివేదికలు

## ప్రజాపక్ష విద్యా మహాసభ

### ౨వ స్థాయిసంఘ నివేదిక

పోవుటచే ఔరంగాబాదునందు మహాసభను సమావేశపరచుటకు ౧౩౪౦ ఫ. అబానుమాసమునందు ప్రయత్నింపబడెను. అనుమతికొరకు విన్నపముగూడ స్థానికసంఘముద్వారా ఔరంగాబాదుజిల్లా అవ్వలు తాలూకాదారుగారికి ౧౩౪౧ ఫ. ఇస్పందారు నెలలో పంపుకొనబడెను. ఇది అంగీకరింపబడలేదు. ఈసంబంధ వ్యవహారపత్రము హోంసెక్రెటరిగారికి పంపబడెను. వ్యవహారము హోంసెక్రెటరి యొద్ద జరుగుచున్నపుడు స్థాయిసంఘపక్షమున విశేషప్రయత్నముగావింపబడెను.కాని హోంసెక్రెటరియొద్దనుండిఒకప్పుడుమరికొంత కాలము మోపికవహించుడనియు, మరియొకప్పుడుయిట్టి అస్పష్టప్రత్యుత్తరములే యొసగబడుచువచ్చెను.తుదకు అనుమతినిగూర్చిన వ్యవహారము జరుపబడుటకు పూర్వము మహాసభవారి ఆశయముల స్వరూపమును తెలిసికొనుటకై విద్యాశాఖాధ్యక్షులతో సంభాషణ జరుపవలసినదని వ్రాయబడెను. అందుపై విద్యాశాఖాధ్యక్షులతో సంభాషణ జరుపవలసినదని వ్రాయబడెను. అందుపై విద్యాశాఖాధ్యక్షులతో సంప్రతించినంతమాత్రమున మహాసభోద్దేశ్యములు నెరవేరజాలవని స్థాయిసంఘపక్షమున తెలుపబడెను. ఇంతియగాక మహాసభ కనుమతి యొసగవలసినదనియు కోరబడెను. కాని ప్రభుత్వమువారిపట్టుదలను వదలలేదు. మహాసభ స్థాయిసంఘ కార్యదర్శులు ౧౩౪౨ఫ, అమర్దాదు ౨౦వ తేదీనాడు విద్యాశాఖాధ్యక్షులతో సంప్రతించిరి. తుట్టతుదకు ప్రభుత్వమువారు ఔరంగాబాదుజిల్లా అవ్వలు తాలూకాదారుగారిద్వార "జమానతుపైగాని మహాసభ కనుమతియొసగవలయును. మహాసభయొక్క పక్షమునకు చెందకపోవుటయేగాక అన్నిపక్షములకు చెందినవారీ మహాసభయందు పాల్గొందురు. మహాసభాధ్యక్షుల యెన్నిక ప్రభుత్వమువారి యంగీకారానంతరము జరుగును. ఇంతియగాక, అంగీకృతనియమములను సంపూర్ణముగా అమలుపరచవలయునను" షరతులపై మహాసభ కనుమతి యొసగబడెను.

ఈనిబంధనల వివరములు స్థాయిసంఘకార్యాలయమునకు ౧౩౪౩ ఫ. షహరేవరు నెలలో తెలిసెను. ఔరంగాబాదు స్థానిక సంఘము వారు ఆలోచన గైకొనినపిమ్మట "జమానతు షరతు విధింపబడుట యుచితముగాలేదు. దానిని రద్దుపరచవలయును. లేనిచో మహాసభ సమావేశపరచుట కష్టసాధ్యమగును" అని ప్రభుత్వమువారికి తెలుపబడెను. "ఒకవేళ ప్రభుత్వమువారిచే విధింపబడిన నిబంధనలు ఆచరణలో నుంచుటయందు ఆక్షేపణయుండుచో మహాసభకు అనుమతి యొసగబడజాలదు" అని ప్రభుత్వమువారు ౧౩౪౪ఫ. దై ౨౫వ తేదీనాడు ప్రత్యుత్తరము నొసగిరి.

ఈసందర్భమున మహాసభ సమావేశపరుపబడనందులకు స్థానికపత్రికలందు కొంత అపోహ ప్రబలుటచే ౧౯౩౪ డిసెంబరు నెలలో సంఘపక్షమున నొకప్రకటన గావింపబడిన నిజపరిస్థితులు వెల్లడింపబడెను.

పిమ్మట మెకంజీ సంఘస్థాపన విషయము తెలిసినపిమ్మట స్థాయిసంఘ పక్షమున యొక ప్రతినిధిని సంఘమునందు చేర్చుకొనవలయునని కోరబడెను. ఇందు అపజయము కలుగుటచే యొక వ్రాతపూర్వక ప్రకటన స్థాయిసంఘపక్షమున గావింపబడెను.

పండిత రామచంద్ర నాయకు, పండిత లక్ష్మణరావుగారు, పండిత మాడపాటి హనుమంతరావు పంతులుగారలు స్థాయి సంఘపక్షమున తమస్టేటుమెంటును మెకంజీకమిటీవారి సమక్షమున నొసగిరి. వ్రాతపూర్వకముగా నొసగిన కమిటీవారిస్టేటుమెంటు లఘు పుస్తకరూపమున ప్రకటించిపంచిపెట్టబడెను. ఈసంబంధమున నే అనేక పర్యాయములు ప్రయత్నములుచేయగా ౧౩౪౫ఫ, బహమన్ ౧౭వ తేదినాడు "జమానతు షరతు రద్దుపరుపబడినది. వినను యితరషరతులు ఆచరణలో పెట్టబడవలయును."అని ప్రభుత్వమువారు తెలిపిరి. ఈసంబంధమున రాజకీయ, విద్యాశాఖమంత్రులు జూపిన సానుభూతి, గైకొనిన అభిరుచిపై సంఘమువారు వారి కృతజ్ఞతయొయుందురు.

౧౩౪౪ఫ. అమర్దాదు నెలలో నిజాంకాలేజి, ఉస్మానియా విశ్వవిద్యాలయములో విద్యార్థులసంఖ్య నిర్ణీతము గావించుటచే యొకవిధముగు సంచలనము కలిగించెను. ఒక హైదరాబాదు విద్యార్థి తనతలిదండ్రులు బొంబాయివిద్యావ్యయములు భరింప శక్తిలేనివారను కారణమున సముద్రమునందుదూకి మరణించుటకై ఆత్మహత్య ప్రయత్నము గావించుకొనెనను వార్త బొంబాయిపత్రికయందు ప్రకటింపబడెను.ఈవిషయమున ఉస్మానియా విశ్వవిద్యాలయముతోను, నిజాంకాలేజి బోర్డుఆఫ్ గవర్నర్సుతోను ఉత్తరప్రత్యుత్తరము జరుపబడెను. ప్రజాసామాన్యముయొక్క యిబ్బందుల తొలగించుటకై ప్రయత్నము గావింపబడెను. ఉస్మానియావిశ్వవిద్యాలయాధ్యక్షునితో, మహారాజా సర్ కృష్ణప్రసాదు బహాదురుగారితోను, నిజాంకాలేజ బోర్డు ఆఫ్ గవర్నర్సు అధ్యక్షులతోను సంప్రతించుటకు ప్రత్యేకముగా సంఘముపక్షమున నొక రాయబారవర్గము పంపబడెను. ఇతరరాష్ట్రములందలి విశ్వవిద్యాలయముల ఆచరణలవలనను, మనరాష్ట్రపు విద్యాపరిస్థితులను దృష్టియందుంచుకొనియు, ఉన్నతవిద్యను నిర్ణీతమొనర్చుట నుచితమని వారికి విన్నవించుకొనబడెను. ఈ సందర్భమున కమిటీవారి వాజ్మూలము వివిధపత్రికలందు ప్రచురింపబడెను.

ఈసంప్రతింపుల సందర్భమున ప్రభుత్వము వారిపక్షమున, ప్రజలుగూడ విద్యాసమస్యలందు అభిరుచిజూపింపవల్లయుననిసూచింపబడెను కావున యీమహాసభ మూడవసమావేశమునకు మరలప్రాముఖ్యతగలిగెను. ఇంతియగాక కొలాతీతమైన కారణమున మహాసభను నగరమునందే సమావేశపరచుటుచితమని తోచెను. అదే ప్రకారము ప్రభుత్వము పత్రవ్యవహారము ప్రారంభింపబడెను. జమానతుషరతు రద్దగుటచేతను, విద్యావిధాన పునర్నిర్మాణసమస్యఆలోచనయందుండుటచేతను బ్రిటిష్ఇండియాయందలి విద్యాప్రముఖులను అధ్యక్షులనుగా నెన్నుకొనవలసిన అవసరముగలిగెను. తుదకు మహారాజా కాలేజి ప్రిన్సిపాలులగు డాక్టరు బొలకృష్ణ పి. హెచ్. డి. గారి యాజమాన్యమున మూడవసమావేశము జరుప నిశ్చయింపబడెను. ఇదేవిషయము ప్రభుత్వమువారికి తెలుపబడెను భూమ్యాదాయ, రక్షకశాఖామంత్రులతో సంప్రతనము జరిగెను. కాని ముల్కీనే అధ్యక్షునిగా నెన్నుకొనవలయునని ౧౩౪౫ ఫ. తీర్ ౨వ తేదీని ప్రత్యుత్తరమొసగబడెను. అందుపై ఆహ్వానసంఘమువారు శ్రీరామచంద్ర నాయకు ఎం. ఏ. బారిష్టరుగారి సభ్యతులుగా నెన్నుకొని ప్రభుత్వమువారికి తెలిపిరి. కాని దురదృష్టవశమున [ . ] సంఖ్యగల ౧౩౪౫ ఫ. షహరేవరు ౨౧వ తేదినాటి మురాసిలాద్వారవారియాజమాన్యతకు ఆక్షేపణతరము తెలుపుచు వేరొకముల్కీవ్యక్తి నామము తెలుపుకొన సూచించిరి. ఆహ్వానసంఘపక్షమున పండిత కాశీనాథరావు వైద్య అడ్వొకేటు. ఎం. ఏ., ఎల్. ఎల్. బి. గారిని అధ్యక్షులుగా నెన్నుకొనగా ౧౩౪౫ ఫ. మెహరు ౩౦ తేదీనాడు దీనిని ప్రభుత్వముభారంగీకరించిరి.

గత యైదువత్సరములలో జిల్లాలలోని పాఠశాలల విషయమునగల యిబ్బందులనుగూర్చి ప్రభుత్వమువారితో యుత్తరప్రత్యుత్తరములు జరిపి వానినితొలగింప ప్రయత్నింపబడెను.

జిల్లాలందు ఉపసంఘములు స్థాపించుటకు ప్రయత్నము చేయబడెను. అందుకై కొన్నిప్రదేశములందు సంఘములు . నెలకొల్పబడినవి.

రెండవమహాసభ సమావేశాంతమున ముద్రిత నివేదికనుబట్టి స్థాయిసంఘమునందు రు ౧౦౪౭-౯-౪లు నిలువయుండెను. వ్యయములు పోగా ౭౦౨-౧౧-౦లు సెంట్రలుబ్యాంకునందు గలవు.

### ఆదాయవివరము

| | |
|---|---|
| గత నివేదికయందు నిలువ | ౯౩౪-౬-౭ |
| వడ్డీ | ౧౧౨-౪-౫ |
| నివేదికల అమ్మకము | ౦-౯-౦ |
| టపాటికెట్లు | ౦-౫-౪ |
| | ౧౦౪౭-౯-౪ |

### వ్యయవివరము

| | |
|---|---|
| ముద్రణ, పైపువ్యయము | ౨౪౫-౧౪-౦ |
| టప్పా, ఇంతవ్యయము | ౪౬-౯-౭ |
| స్టేషనరీ | ౧-౭-౦ |
| పుస్తకములు, నివేదికలు, పత్రికలు, కొనినవ్యయము | ౪౭-౯-౩ |
| కార్యదర్శివద్ద నిలువ | ౪-౯-౧౦ |
| | ౩౪౪-౧౪-౪ |
| కోశాధిపతివద్ద నిలువ | ౭౦౨-౧౧-౦ |



## చందాదారులకు

తమ ఉత్తర ప్రత్యుత్తరములలో ఖాతానంబరు తెలుపవలెను. లేదేని జవాబు ఇవ్వబడదు. తమ లేఖలు మేనేజరు పేర వ్రాయవలెను,

తనమాతృభాషాజ్ఞానములే
నిభారతీయుని
పీమనవలెన?
అతనిని భారతీయుడని
చెప్పదగునా?''

# గోలకొండపత్రిక

# GOLKONDA PATRIKA

HYDERABAD-DECCAN

The First Telugu Bi-Weekly in Andhra Desa and the only Telugu Newspaper
for H E H. The Nizam's Dominions.

వర్తకులకు

నిజాంరాష్ట్రపు ఎనిమిది
జిల్లాలలోని ఆంధ్రుల
లో మీవర్తకవృద్ధికి
సాధనము గోలకొండ
పత్రికలో ప్రకటనము

Vol. 11. | Monday 30—11—1936 | No. 56

## స్పెయినులో పోరాటము

శ్రీయుత రావినారాయణరెడ్డిగారు

[౫౧ వ సంచిక తరువాయి]

### సమరపక్షములు

పారిశ్రామికాభివృద్ధిని భూస్వాములును పౌరోహితులును ప్రోత్సహింపకుండుటచే, మాధ్యమికులతరగతికిజెందిన వారు సంఖ్యయందును, బలమునందును, అభివృద్ధిగాంచలేదు. బూర్జువా (Bourgeoisie) సంఘమునకుజెంది నవారెట్టుమొగ్గునన నిశ్చయింపజాలకుండిరి. వీరిపెట్టుబడి భూములయందుండుటచే, సామాన్యభూమిభూస్వాములకు లభించినది. కొన్నిసమయములయందు వీరు కార్మికులకు సహాయముగావించినప్పటికిని, ఎక్కువగా వీరు జనసామాన్యోద్యమముల నణచుటయందు ప్రతీకారులతో నేకీభవించిరి.

విద్యార్థికులకు అరాజకీయ (Anarchism) సిద్ధాంతముపైన ప్రేమయుండుటచే, వీరుగూడా పౌరోహితులకును, భూస్వాములకును ప్రతికూలురు. వీరియందలి పూర్వాచారపరాయణతయు, నీతిబాహ్యతయు విద్యార్థికుల అసహ్యతకు పాత్రములాయెను. ఈవిద్యార్థికులు అల్ప బూర్జువా (Petty- Bourgeoisie) తరగతివారిని ఆకర్షించియున్నారుగావున వారుగూడా ప్రభుత్వములో జేరినవారే.

కార్మికులయందును వ్యవసాయకులయందును పేర్కొనదగినంత భేదములేదు. వ్యవసాయకులుతరచుగా కార్మికవృత్తి నవలంబించుచుందురు. భూమిపైనుండి ఒత్తిడి, వ్యవసాయపని కార్మికవృత్తి నవలంబింప నిర్బంధించును. పరిశ్రమయందలి నిరుద్యోగసమస్య, ఈచలనమును తలక్రిందుగామార్చును. స్పెయినుకార్మికులయందు సమరకౌశల్యతయు- బాహుళ్యముగానున్నది. కాని వారియందు అంతఃకలహములుగూడామెండు, ప్రస్తుతము వారైకమత్యముతో శత్రువుల నెదిరించుచుండుట శుభసూచకము.

వ్యవసాయకులు మొదలగు వెనుకబడియున్న కార్మికులయందు ప్రస్తుతమత్యంతసంచలనము గలిగినది. ప్రేమయూనియనునందలి సభ్యత్వములోని చాలభాగము వీరికే జెందియున్నది. ఈకాలదినమాసములలో కమ్యూనిస్టుల సంఖ్య అత్యధికముగా పెరిగిపోయి చాలగింతపైనది. క్రొత్తసభ్యులందరును గ్రామములనుండియు పరిశ్రమలులేని స్థలములనుండియు వచ్చియున్నారు. పరిశ్రమకేంద్రములగు బార్సిలోనానుండి కమ్యూనిస్టులకెక్కువగా బలములభించలేదు. పరిశ్రమలకు ముఖ్యకేంద్రమగు బార్సిలోనాయందు అనార్కో-సిండికలిస్టులు Anarco Syndicalistis అను వారికే బలమధికముగానున్నది. వీరంతకుముందు తప్పులుజేసినప్పటికిని, ప్రస్తుతము ఇతరకార్మికులతో నేకీభవించి ప్రభుత్వరక్షణార్థమై నడుముగట్టియున్నారు.

శ్రీరాజా రామదేవరావు బహదరుగారు.

ఆంధ్రసంస్థానములలో ముఖ్యమగు వనపర్తికధీశులు.
వీరు బాలికల ఉన్నతపాఠశాలయొక్క మందిర నిర్మాణమునకై
రెండువేల రూపాయలు దయచేసిరి.

## రాజకీయచరిత్రయందలి కొన్నిదృశ్యములు

స్పెయినుచరిత్ర విషాదపూరితమైనది. పదునారవ శతాబ్దమునందును, అంతకుముందును ఈరాజ్యము మహోన్నతి దశయందుండి, "సముద్రపురాణీ" అను బిరుదమువహించి యూరపుఖండమందలి ఇతరదేశములకు ఆదర్శపూర్వకముగానుండెను. స్పెయిను సామ్రాజ్యముపై నేటిబ్రిటిషు సామ్రాజ్యమువలెనే రవిఅస్తమింపకుండెను. కాని ఈదేశము అయోగ్యతచే తనకుగల ఉన్నతస్థానము నిలుపుకొనజాలక స్తబ్ధతనొంది యైనందున ఇతరదేశములందు జరుగుచున్న పారిశ్రామిక రాజకీయాది అభివృద్ధులను అనుకరించు శక్తినిగూడా గోలుపోయినది. స్పెయిను యింగ్లాండుతో ౧౫౮౮ సంవత్సరమున నావికయుద్ధ మొనరించి ఓడిపోయినది. ఈదేశపుక్షీణత, ఆనాడారంభముజెంద ౧౮౩౧ సంవత్సరమునకు పదమూడవ అల్ఫాన్సోరాజుగారి రాజ్యభ్రష్టతతో అంతమొందినది. ఈమధ్యకాలమున అరబుదేశీయులను యూదులను దేశమునుండి తరుముటచే దేశమున కపరిమితమైన నష్టముసంభవించినది. మాధ్యమిక తరగతికిజెందినవీరు దేశమునందలి పారిశ్రామికాభివృద్ధికి. ఏంతయో తోడ్పడెడివారు. దేశీయులు-ముఖ్యముగా యువకులు, క్యాథలిక్ మతావలంబకులై ఎందరో సంసారత్యాగ మొనరించి పనికిరానివారుగా నైపోయిరి.

స్పెయిను సామ్రాజ్యమును గోలుపోయెను. జాతీయతకు ముఖ్యాంగమగు ఐక్యతనుగూడా గోమకోలేదు పందొమ్మిదో శతాబ్దమునందీదేశపు రాజకీయచరిత్ర, సైనికనాయకుల విజృంభణచరిత్రయనియే చెప్పవచ్చును. రాజ్యనిర్మాణ చట్టమేర్పడియుండ నున్నప్పటికిని, సైనికాధికారులు పౌరోహితులు, తమయిష్టానుసారము మెలంగుచు, వారియాధిక్యతను గెలిపించుకొనజాలుచుండిరి ప్రజాస్వామిక సిద్ధాంతమీదేశమునందు ౧౮౭౦ సంవత్సరముపిదప ప్రబలినది ఈఉద్యమము ప్రబలి ౧౮౭౩ సంవత్సరమునందు దేశమును పరిపాలించుచున్న రాణిని దేశమునుండి తరిమివేసినది. ఈసిద్ధాంతమునకు బలమస్థిరముగా చేకూరలేదు, ప్రజాస్వామిక ప్రభుత్వము దేశమునందు నామమాత్రావశిష్టమై యుండెను. సైనికాధికారులకు, పౌరోహితులకుండు ఐక్యత అప్పుడప్పుడు భంగముజెంది, సైన్యము ప్రజాస్వామికులకు సహాయము గావించుచుండెను కుత్తముపై సైనికాధికారులు. నియంతప్రభుత్వమునకనుకూలురుగావున, లిబరల్ (Liberal) ప్రభుత్వమెప్పుడును స్పెయినునందు స్థిరముగానుండజాలకపోయినది. పరిపాలకులెల్లప్పుడును సైన్యముయొక్కయు పౌరోహితులపక్ష మవలంబించి ప్రజాస్వామిక ప్రభుత్వమునకు ప్రతికూలముగానుండిరి.

### పదమూడవ అల్ఫాన్సోరాజు

ఈతడు ౧౮౮౬ సంవత్సరమునందు సింహాసనమధిష్ఠించి తనకుటుంబములోని పూర్వపురాజుల నిరంకుశ పరిపాలనాపద్ధతుల ననుకరించెను. ఈతనికాలమున ప్రజలయందుస్వాతంత్ర్యేచ్ఛ, అభివృద్ధిజెందినప్పటికిని, ఇతడు కాలము ననుసరించి నడచుకోలేదు. పూర్వీకులవలెనే యీతడు ప్రజాస్వామిక ప్రభుత్వస్థాపనకు ప్రతికూలించి, స్పెయినుదేశపు పార్లమెంటగు కోర్టసు [Cortes] యధికారములను తిరస్కారదృష్టితో నిరోధించెను. ఇతడుగూడా సైనికనాయకులతోను పౌరోహితులతోను ఏకీభవించి జనసామాన్యమునకుజెందిన స్వాతంత్ర్యవాంఛను అణగద్రొక్కెను.

### ప్రపంచ యుద్ధము

౧౯౧౪ సంవత్సరమున యారంభమైన ప్రపంచ యుద్ధమున పదమూడవ అల్ఫాన్సోరాజు తనదేశమును, పాల్గొనజేయలేదు. ఇది మిక్కిలి ప్రశంసనీయమైన ప్రవర్తన. ఈతడు తనపరిపాలనకాలమున గావించిన కార్యములయందిదియొక్కటియే దూరదృష్టిగలది. ఈకారణముచే స్పెయినుకు మంచి అర్థికలాభము చేకూరినది. యుద్ధమునందు పాల్గొనినచో దేశమింకను అధోగతిపాలైపోయెడిది. యుద్ధమునందు పాల్గొన్న ఆస్ట్రియా-హంగరీ దేశముల విధముగనే, హీనముగ నుండెడిది.

### యుద్ధానంతరము

యుద్ధానంతరము ప్రపంచమునందు సహజముగా నుద్భవించిన స్వాతంత్ర్యాభిలాష స్పెయిను దేశీయులందుగూడా బలపడినది. కాలము మారినప్పటికిని, అల్ఫాన్సోరాజాగారి నిరంకుశత్వము లేశమైననుతగ్గలేదు. ప్రజలలో అశాంతి, అసంతృప్తి దినదినాభివృద్ధిజెంద నారంభించెను. ప్రజలలో నధికముగా నున్న అసంతృప్తినుండి రాజ్యాధికారమునుగా పాడునందులకును, రాజాగారి నిరంకుశ పరిపాలనమును విజయవంతముగాను సంపూర్ణముగా నొనరించుటకును, బార్సిలోనాయందలి సైనికాధికారియగు ప్రమో-డి- రివరా (Premo-d-Rivera) ౧౯౨౩ సంవత్సరమునందు సైనికవిప్లవముజేసి, నియంతృపరిపాలనము స్థాపించెను

౧౯౨౩ సంవత్సరమునుండి ౧౯౩౦ వరకు స్పెయినుదేశ, మీనియంతృ పరిపాలనకు లో

Printed and Published by G. Ramakrishna Reddy at the Golkonda Power Press Hyderabad. Editor K. Balakrishna Reddy.